# కాంతి పుంజం

(కవితా సంపుటి)

Acc. No
28215

రేగులపాటి కిషన్‌రావు

విజయలక్ష్మి పబ్లికేషన్స్
చింతల్‌ఠాణం-505 405
కరీంనగర్ జిల్లా-ఆంధ్రప్రదేశ్

విజయలక్ష్మీ పబ్లికేషన్స్ ప్రచురణ నెం 18

ప్రథమ ముద్రణ జూన్ 1999 వెల రు. 12-00

ప్రతులకు

రేగులపాటి కిషన్‌రావు
జి.ప.సె. పాఠశాల రుద్రంగి
జి॥ కరీంనగర్ ఆం. ప్ర.
పిన్ 505307

ఆలూరి ఆనందరావు
కవితానిలయం
ఇం. నెం. 10-1-216
రామ్‌నగర్, కరీంనగర్ ఆం.ప్ర

రేగులపాటి కిషన్‌రావు
ఇతర రచనలు

గెలుపొందిన పావురం
మా ఢిల్లీయాత్ర
దివ్యశక్తి
చుక్కల వెలుగులు
తేనెజల్లు
పెళ్లి ఇంటర్వ్యూ
అమృతాక్షరాలు
ప్రేమ గీతాలు
కాంతి చక్రం

ముద్రణ: విష్ణు ప్రింటింగ్ ప్రెస్, సిరిసిల్ల జి. కరీంనగర్ అం. ప్ర.



# మాతృదేవత

పోయితివా నువ్వు దివికి పోయితివా తల్లీ
కానరాని ఆ లోకం చేరితివా తల్లీ।
కఠినాత్ముడు ధర్మమూర్తి కబళించెను నిన్నూ
ఇహలోకం వీడి ఎటకు వెళ్ళితివో తల్లీ ।
భువిని వీడి దివికి చేరి మురిసితివా తల్లీ
భూమి మీద మమ్ము వదలి మరువకు మాతల్లీ ।
రాగాలను శోకాలను వదలితివా తల్లీ
అమరులుండు ఆలోకం చేరితివా తల్లీ ।
కల్పవల్లి పాలవెల్లి కరుణానిధి తల్లీ
కన్నుమూసి మమ్ము వదలి పోయితివా తల్లీ ।
పది నెలలూ మోసి మమ్ము కనిపెంచిన తల్లీ
కనిపించిన దేవతవే కనిపించవు మళ్ళీ ।
కన్నతల్లి రుణము ఎవరు తీర్చలేరు తల్లీ
మరుజన్మలో మమ్ము చేరి సేవపొందు తల్లీ ।
మనుమరాలులాగ వచ్చి ముదముపంచు తల్లీ
నీవులేని ఆలోటును పూరించుము తల్లీ ।
తారలాగ ఆకసాన వెలుగుచుండు తల్లీ
తారలమై వచ్చువరకు దివిలో ఉండు తల్లీ ।

తేది 02-05-1999 నాడు కన్నుమూసి కాంతిపుంజం చేరబోయిన
కన్నతల్లికి ఈ 'కాంతిపుంజం' సమర్పితం.

# రేగులపాటి చంద్రమ్మ-భూంరావు ల వంశవృక్షం.

* పోలాడి వజ్రమణి-తిర్మల్ రావు
  1. సుజాత-మధుసూదన్ రావు
     స్వప్న, సంధ్య
  2. రజిత-లక్ష్మణ్ రావు
     అభిలాష్, అఖిల్
  3. పద్మ-సత్యనారాయణరావు
     రవితేజ, కృష్ణచైతన్య
  4, శ్రీనివాసరావు-

* రేగులపాటి కిషన్ రావు-విజయలక్ష్మి
  1. కవిత-ఆనందరావు
     నిహిత్ కుమార్

* బొంపెల్లి సుశీల-జలపతిరావు
  1. అంజలి-ఆనందరావు
     సంతోష్ కుమార్, సౌమ్య, సౌజన్య
  2. వెంకటేశ్వర్ రావు-
  3. హరికిషోర్-

* రేగులపాటి కమలాకర్ రావు-సంధ్య
  1. శిరీష-
  2. వంశీకృష్ణ-

* అయిల్నేని వనజ-చంద్రశేఖర్ రావు
  1. శరత్ కుమార్-
  2. సందీప్-

# తెలుగు వాడా!

తెలుగువాడా! వెలుగువాడా!
తెలుగు భాషను ఆదరించీ
తెలుగు భాషను అభ్యసించీ
తెలుగు భాషను ఉద్ధరించుమురా.

తెలుగు కోసం తెలివికోసం
తెలుగు పలుకులు పలికి పలికీ
తెలుగు ఘనతను చాటి చెప్పీ
తెలుగు తేజును పంచుచుండుమురా.

తెలుగు పాటలు పాడనేర్చీ
తెలుగు కథలను చెప్పనేర్చీ
తెలుగు కావ్యము చదువ నేర్చీ
తెలుగు వక్తగ మెప్పుపొందుమురా.

తెలుగు ఘనతను తెలియజేసే
తెలుగు సాహితి చదివి చదివీ
తెలుగు వారల కవన ఘనతను
తెలుగు భాషలో చెప్పుచుండుమురా.

తెలుగువారలు మెచ్చునట్లుగ
తెలుగు భాషను వ్యాప్తి చేసీ
తెలుగు తనయులు సంతసించగ
తెలుగు సంస్కృతి చాటిచెప్పుమురా.

# పల్లెటూరు

పల్లెటూరు ప్రగతిపాట
పాడుతోంది నేడు
తనకుతానె సాటియనుచు
ఆడుతోంది చూడు.

ధాన్యలక్ష్మిలా పంటలు
పంచుతోంది నేడు
అందమైనలోగిళ్లను
చూపుతోంది చూడు.

ఫలసుమాలు పట్నానికి
పంపుతోంది నేడు
పాలు పంచి ఆరోగ్యం
పెంచుతోంది చూడు.

మనసు మెచ్చు దృశ్యాలతో
ఎదుగుతోంది నేడు
పచ్చనైన చెట్లమధ్య
నవ్వుతోంది చూడు.

విద్యలందు తనసత్తా
చూపుతోంది నేడు
కళాసృష్టిచేసి కళలు
పంచుతోందిచూడు.

ఎన్నదగిన పద్ధతిలో
ఎదుగుతోంది నేడు
ఎందరినో రారమ్మని
పిలుస్తోంది చూడు.

# ఎందుకు?

ఆంధ్ర భాష అక్షరాలు
అన్ని నువ్వు నేర్చినా
"కవిత్రయం' లాగ ఎపుడు
కవిత వ్రాయవెందుకు ?

నడవ గలుగు కాళ్లు రెండు
దృఢముగానె ఉన్న నూ
మహా శివుని లాగ నువ్వు
నాట్యమాడ వెందుకు?

మాటలాడు స్వరపేటిక
చక్కగానె ఉన్ననూ
ఘంటసాల లాగ నువ్వు
పాడజాల వెందుకు?

బొమ్మగీయుపరికరాలు
నీదు చెంత ఉన్ననూ
'బాపు' లాగ బొమ్మ నువ్వు
గీయ జాల వెందుకు?

శిలలు చెక్కు పరికరాలు
అన్ని నీకు ఇచ్చినా
'మహా శిల్పి జక్కన' వలె
బొమ్మచెక్కవెందుకు?

అమ్మనేర్పి నట్టి భాష
ఎంత నువ్వు నేర్చినా
మహావక్త లాగ ఇపుడు
మాటలాడ వెందుకు?

# నిరాశచెందకు

నిరాశ చెందకోయీ
బ్రతుకునందు మంచిమార్పు వచ్చిచేరునోయీ

ఆకులన్ని రాలాయని
చెట్టు చచ్చి కూలేనని నిరాశచెందకోయీ
సృష్టి మార్పునందు
చిగురు వచ్చి చెరునోయీ
పచ్చనైన ఆకులతో
చెట్టు ఎదుగునోయీ

మేఘమొకటి కనరాదని
వానజల్లు పడబోదని నిరాశచెందకోయీ
కాల గమనమందు
మేఘమాల వచ్చునోయీ
వర్షించుచు హర్షమ్మును
నీకు పంచునోయీ

చేసినపని చెడినదనీ
అభ్యుదయం ఇకలేదని నిరాశచెందకోయీ
మరల మరల పనిచేసిన
పనితనమే పెరుగునులే
ప్రతిదినమ్ము పనిచేసిన
ప్రగతిజల్లు కురియునులే

నిరాశనీకు తగదోయీ
బ్రతుకునందు మంచి మార్పు వచ్చి చేరునోయీ

# వికటవుం

అందమైన కవిత నేను
వ్రాయాలని తలపెట్టితి.
ప్రకృతి అందాల తీరు
వర్ణించగ తలపెట్టితి.
తలపెట్టినదే తడవుగ
దిక్కులదర పిడుగులుపడె.

కరుణ చిందు కవితనేను
వ్రాయాలని తలపెట్టితి.
జంతుజాతి కరుణ గాథ
వ్రాయనేను తలపెట్టితి.
తలపెట్టినదే తడవుగ
వినిపించెను గాండ్రింపులు.

సొగసులొలుకు కవితనేను
వ్రాయాలని తలపెట్టితి.
పక్షిజాతి సొగసులనే
వర్ణించగ తలపెట్టితి.
తలపెట్టినదే తడవుగ
రాబందులు కనిపించెను.

ఘనత తెలుపు కవితనేను
వ్రాయాలని తలపెట్టితి.
మనిషి ఘనత తెలియజేయు
కవిత వ్రాయ తలపెట్టితి.
తలపెట్టినదే తడువుగ
హత్యవార్త వినిపించెను.

# అంతరాలు

పశు గణమున పేదధనిక
భేదము లేనాడు లేవు
పక్షి జాతిలో సహితము
అంతరాలు కానరావు

చెట్టుచేమలందు మనం
అంతరాలు చూడ లేము
జల చరముల జాతులలో
తేడా కనరాదు మనకు

మనుజులలో రకరకాల
విభేదాలు ఎందులకో?
కుల భేదం, మతభేదం
ఎంచుచుందు రెందులకో?

పనిచేయటలో భేదం
నరులలోనె కనిపించును
ఉన్నవాడు లేనివాడు
మనుజులలో ఉందురేల?

మనుజులలో నిలిచియున్న
విభేదాలు రూపు మాపి
సమత మమత భావాలను
మనసు మనసున నిలుపుదాం.

# అరణ్యం

విపినమా! ఓ విపినమా!
నీసొగసులు చూడగానె
మా మనసులు పరవశించు
విపినమా! ఓ విపినమా!

నీ అందం తరగనిదని
తెలిసె మాకు నిజమమ్మా
ప్రాణులనూ కాచు దివ్య
శక్తి నీకు కలదమ్మా
విపినమా! ఓ విపినమా!

మాకళ్లకు ఇంపుకూర్చు
పచ్చదనము పంచుతావు
మా మనసులు మెచ్చునట్టి
పూలు నువ్వు పెంచుతావు
విపినమా! ఓవిపినమా!

స్వచ్ఛమైన గాలి పెంచి
సదా మాకు పంచుతావు
పత్రాలను వదలి నేల
సారమెంతొ పెంచుతావు
విపినమా! ఓ విపినమా!

మధురమైన ఫలములిచ్చి
మా బ్రతుకులు పెంచుతావు
మకరందము మాకు పంచి
మా మనసులు నింపుతావు
విపినమా! ఓ విపినమా!

పరుల హితము కోరినీవు
జీవితమును అర్పింతువు
గిట్టిపుట్టి పుడమి రుణము
తీర్చుకొందువిది సత్యం
విపినమా! ఓ విపినమా!

## చెలిమి

మంచితనము నందించిన
మనసునీకు అందిస్తా.
మమత నీవు అందించిన
సమత నేను అందిస్తా.
పలుకు పలుకులో తీయని
పలుకు నీవు అందించిన
పద పదమున తేనెలూరు
పదములనే కురిపిస్తా.
స్నేహితమే జీవితమని
చెలిమి నీవు అందించిన
చెలిమి కొరకు సేదతీర్చు
చేయినేను అందిస్తా.

# మంచి కొరకు

ఉద్రేకం వద్దు వద్దు
ఉన్మాదం అసలె వద్దు
ఉద్యమాల పేరు చెప్పి
నాశనమ్ము చేయ వద్దు.

అంతరాలు తొలగిపోవు
మార్గాలను యోచించుడు
అణచబడిన సోదరులను
ఐక్యపరచ యత్నించుడు.

శ్రమజీవుల మనములలో
చైతన్యము కలిగించుడు
అజ్ఞానము తొలగిపోవు
జ్ఞానజ్యోతి వెలిగించుడు.

బడుగు జనుల ఉద్ధరణకు
బాటలన్ని యోచించుడు
పథకముతో ఉద్యమాలు
నిర్వహించ తలపెట్టుడు.

మంచి మార్పు తెచ్చుటకై
మంచితనం పంచవలయు
మమతనెపుడు పెంచి పంచి
మంచిని సాధించ వలయు

# భేదమేంది?

ఒక్కటేరా ఒక్కటేరా
మనుజులందరు ఒక్కటేరా
హద్దు రేఖలు ఎన్నిగీసిన
విశ్వమంతా ఒక్కటేరా ॥ఒక్కటేరా॥

జాతిమతములు కులము పేరిట
జనుల గణములు ఎన్నిచేసిన
సృష్టిశాస్త్రము చదివి చూచిన
ఒక్కటేరా మనుజులందరు ॥ఒక్కటేరా॥

ప్రాణిప్రాణికి బ్రతుకునిచ్చే
గాలికేవిర కులమతమ్ములు
నింగిలో తిరుగాడు సూర్యుని
వెలుగు వేడికి జాతి ఏదిర? ॥ఒక్కటేరా॥

సర్వ ప్రాణులు గ్రోలునట్టి
నీరమునకూ కులము ఏదిర?
అంతులేని అంబరానికి
కులమతమ్ముల భేదమేదిర? ॥ఒక్కటేరా॥

ఎత్తుగా యోచించ గలిగితె
ధారుణీ నరులంత ఒక్కటె
నరుల నరముల పారుచుండెడు
రక్త వర్ణము ఒక్కటే కద ॥ఒక్కటేరా॥

# చీకటి వెలుగులు

ఎడారిలో చినుకు లాగ మనసు మురియు చుండగా
వర్ష ఋతువు వరదలాగ వేదన వస్తున్నది.

కొందరిలో అక్షరాలు ఎండిన మడుగులు కాగ
కొందరిలో పాండిత్యం పొంగి పొర్లుతున్నది.

సౌజన్యం తేనెలాగ బొట్టుబొట్టుపడుచుండగ
దౌర్జన్యం తుపానులా అదరగొట్టు చున్నది.

పాలనలో నీతి నాతి వివస్త్రలాగపడిఉన్నది
అధికారము అందలమ్ము ఎక్కితిరుగుతున్నది.

న్యాయం చల్లారుచున్న నిప్పుచందమగుచుండగ
అన్యాయం మండుచున్న అడవిచందమగుచున్నది.

ధర్మం కాళ్లు విరిగి నడవలేక నడచుచుండ
అధర్మమ్ము నక్కలాగ పెద్ద పరుగు తీస్తున్నది.

శాంతిసుమము పరిమళమునుపంచివిందు చేయుచుండ
హింస కంపలాగ వచ్చి ఒళ్లు చీరి వేస్తున్నది.

ఐక్యత సాధించుకొరకుచేయిచేయి కలుపుచుండ
విభేదాల విషసర్పం కాటువేయ జూస్తున్నది.

సమత కూత గొంతులోనె అణచి వేయబడుచుండగ
అంతరమ్ము అగ్నిబిమ్మ పర్వతమేయగుచున్నది.

# భక్తి

మనసు నిండ నీవు ఉండ పూజింతునురా
నాకు అండ నీవు ఉండ రావేందుకురా.

నాటి నుండి నేటి వరకు మరువలేదు నిన్నురా
నోటి నిండ నీ నామమె స్మరణచేయుచుంటిరా.

కనిపించుము మురిపించుము క్షణమైనను చాలురా
కనిపించని నీఉనికిని ఎపుడు నమ్మ జాలరా.

వినిపించుము మధురవాక్కు ఒకటియైన చాలురా
పలికించుము నాచేతను సూక్తి సమూహమ్మురా.

నీ రూపము నామనమున నిలిపి ఉంచుతానురా
భక్తి శక్తి నామదిలో పెంచి ఇమ్ము నీవురా.

నాశక్తిని మంచికొరకు వెచ్చింతును లేరా
యుక్తమైన శక్తి నాకు అందించగరారా.

సజ్జన స్నేహమ్ము నాకు కల్పించగ రమ్మురా
సద్గుణములు నాకు నీవు ప్రసాదించి పొమ్మురా.

దీక్షతోడ పనులుచేయు శక్తి నాకు ఇమ్మురా
చేసిన పనులన్ని ఫలము పొందు వరమునిమ్మురా.

భక్తి శక్తి ఇచ్చునను మాటనమ్మినానురా
వరము పొందజాలని నాభక్తి భావమెందుకురా?

కోరజాలనట్టి కోర్కె నిన్ను కోరలేనురా
ఇవ్వజాలినట్టి వరము ఇచ్చి సాగిపొమ్మురా.

# ఇక్కడే ఉంటాను

ఎడారిగా మారినట్టి
నేలలన్ని తడుచు వరకు
తడిసి తడిసి చెట్టు చేమ
పెరిగి ఫలములిచ్చు వరకు నేను ఇక్కడే ఉంటాను

వృధాపోవు ఏటి నీరు
పంటచేను చేరువరకు
పండినట్టి పంటలన్ని
శ్రామికులకు పంచు వరకునేను ఇక్కడే ఉంటాను.

ఈ దేశపు జనులందరు
ఉత్పత్తులు చేసి చేసి
స్వంత ఆస్తి పొంది వారు
సంతృప్తి పొందు వరకు నేను ఇక్కడే ఉంటాను.

చెలిమి విలువ తెలియు వరకు
స్నేహితలత పెరుగు వరకు
మనసులలో మమకారపు
మకరందం కురియువరకు నేను ఇక్కడే ఉంటాను.

సమత కొరకు ఉద్యమాలు
నిర్వహించి మార్పు తెచ్చి
నరులందరు సుఖశాంతులు
పొందురోజువచ్చు వరకు నేనుఇక్కడే ఉంటాను.

# మెచ్చునట్లు జీవించు

పుష్పించిన ఆ చెట్టుకు
పూవునేల కాకుంటిని
పూవునైన తావి పంచి
పరవశించి పోవుదునే.

వెదురులాగ ఎదిగి ఎదిగి
వేణువేల కాకుంటిని.
వేణువైన మీ చెవులకు
విందు నేను చేయుదునే.

అక్షరాలు వ్రాయగలుగు
కలమునేల కాకుంటిని.
కలమునైన అక్షరాల
బ్రతుకు ధన్యమయ్యెడిదే.

కొండ అంచు భాగమ్మున
బండనేల కాకుంటిని.
బండనైన శిల్పిచేత
చిక్కి బొమ్మనయ్యెదనే.

పదిమందీ తిరుగుచోట
చెట్టునేల కాకుంటిని.
చెట్టునైన ఆ జనులకు
నీడ నేను పంచుదునే.

పది మందికి పనికిరాని
బ్రతుకు పనికిరాదందును.
హెచ్చుమంది మెచ్చునట్లు
జీవించుట మేలందును.

# పువ్వులా బతుకు

పువ్వులాగ బ్రతకాలి
నవ్వుపంచి బ్రతకాలి
పువ్వే మనకాదర్శం
బ్రతికినంత కాలం ॥పువ్వులాగ॥

జీవించే ఆకాలం
కొంచెమైననేమి
పరిమళాలు పంచి
బ్రతుకు చాలించును పువ్వు ॥పువ్వులాగ॥

తనలోపల మకరందం
ఎంత ఉన్ననేమి
ఉన్నంతలో పంచి
మంచి సాధించును పువ్వు ॥పువ్వులాగ॥

తన శరీర వర్ణమ్మది
ఏది అయిన నేమి
చూచువారి హృదయాలరు
ముదము పంచు పువ్వు ॥పువ్వులాగ॥

గుచ్చుకునే ముళ్లచెంత
తాను ఉన్ననేమి
మెత్తదనం అందిస్తూ
మెప్పు పొందు పువ్వు ॥పువ్వులాగ॥

# జ్ఞానశక్తి

జ్ఞానమునకు రూపేమిటి? జ్ఞానమునకు రంగేమిటి
జ్ఞానమ్మును గజదొంగలు దొంగిలించన జాలరుకద!

అజ్ఞానము తీర్చలేని వెలితిరా
సహజశక్తి లేకుంటే జ్ఞానికాడురా

జ్ఞానశక్తి చేతవక్త శ్రోతను మెప్పించగలడు
జ్ఞానశక్తిచేత శ్రోత వక్త మాట మెచ్చగలడు

అజ్ఞానము తీర్చలేని వెలితిరా
సహజశక్తి లేకుంటే జ్ఞానికాడురా

జ్ఞానశక్తి గలవారే మాటలాడి మెప్పింతురు
జ్ఞానశక్తి గలవారే ఆదరింప బడుచుందురు

అజ్ఞానము తీర్చలేని వెలితిరా
సహజశక్తి లేకుంటే జ్ఞానికాడురా

విజ్ఞానము పంచు కొలది పెరుగుచుండు పెనుసంపద
విజ్ఞానము మన నరులకు ప్రకృతి ఇచ్చిన వరమట

అజ్ఞానము తీర్చలేని వెలితిరా
సహజశక్తి లేకుంటే జ్ఞానికాడురా

జ్ఞానవంతుడే సంపద పెంచగలడు పంచగలడు
జ్ఞానవంతుడే పనులను సులభతరం చేయగలడు

అజ్ఞానము తీర్చలేని వెలితిరా
సహజశక్తి లేనివాడుజ్ఞానికాడురా

# నేలతల్లి

తల్లికన్న గొప్పదిరా ఈనేల
సర్వము సమకూర్చుతల్లి ఈనేల
పుట్టిపెరిగి చచ్చువరకు ఆధారం అవుతుంది ॥

పూలైనా పండ్లయినా
ఆహారం ఏదైనా
నమ్మిన ఈనేల మనకు అందిస్తుంది ॥

తాగునీరు సాగునీరు
స్నానానికి వలయు నీరు
నమ్మిన ఈనేల మనకు అందిస్తుంది ॥

గుడిసైనా ఇల్లయినా
అందమైన మేడైనా
నమ్మిన ఈనేల మనకు అందిస్తుంది ॥

నూలుబట్టలు పట్టుబట్టలు
రంగు రంగుల బట్టలెన్నో
అడిగినంతనె ఆదరించి ఇచ్చును ఈనేల ॥

నిలిచినా నడిచినా
పనులుచేసి అలసినా
ఆదరించి ఆత్మీయత పంచుతుంది నేల ॥

పశువులకూ పక్షులకూ
పలురకాల జీవులకూ
ఆహారం ఆధారం అందించును నేల ॥

గుట్టకైనా చెట్టుకైనా
నీరుకైనా ఏరుకైనా
నిలయాన్నీ నియతినీ కల్పించునునేల ॥

ఆ నరులకు ఈనరులకు
నానాజాతుల నరులకు
నీతి నియతి చరితములను కల్పించునునేల ॥

## అలసుని మనసు

మబ్బులతో
ఆకాశం నిండింది
మెరుపు మెరిసింది
ఉరుము ఉరిమింది
జల్లు కురిసింది
నాగలి నడిచింది
నేల నవ్వింది
విత్తు పలికింది
పైరు పాడింది
పంట పండింది
శ్రమజీవి మనసు మురిసింది
అతని కడుపు నిండింది
అలసుని మనసు మండింది
వాని కడుపు ఎండింది

## శక్తి

శక్తి నీకు ప్రసాదింతు
పోరాడుట నేర్చుకో
జ్ఞానశక్తి నందించెద
ప్రశ్నించుట నేర్చుకో ॥శక్తి॥

నీశరీర కష్టముతో
తయారైన ఫలితమ్మును
పక్కవాడు దొంగలాగ
దొంగిలించి దాచెనదిగో ॥శక్తి॥

మంచినెంచి మంచిపంచి
మనగలిగే మానవుడా!
మలినాత్ముడు మాయచేసి
మోసపుచ్చెనదిగో చూడు ॥శక్తి॥

చట్టాలను ధర్మాలను
చక్కగనువు పాటించగ
చక్కగ మాటాడివాడు
చిక్కుల పాల్జేసెనిన్ను ॥శక్తి॥

నిజంచెప్పు బుద్ది నీకు
పుట్టుకతో వచ్చిననూ
అబద్దాలె నిజాలుగా
చలామణీ చేసెవాడు ॥శక్తి॥

చదువ రాయనేర్చి వాడు
చపటగ నిను చూచుచుండె
వినయముతో నీవుండగ
విర్రవీగు చుండెవాడు ॥శక్తి॥

యంత్రములా పని చేసిన
నీ అక్కర తీరదాయె
పని చేయనివాడు చూడు
పసందుగా బ్రతుకుచుండె ॥శక్తి॥
ఉత్పత్తి చేయు నీకు
పరికరాలు లేవు చూడు
పని చేయన్నివాడు ఇదిగో
పరికరాలు ఇచ్చె నీకు ॥శక్తి॥

## ఎలా ఉండాలి ?

మంచితనం
పరిమళాలు అందించే పసిడి పువ్వులా ఉండాలి.
మానవత్వం
సజీవ క్షీరతరంగిణిలా ప్రవహిస్తూ ఉండాలి.
ధర్మం
బ్రద్దలు కొట్టలేని ఉక్కు దుర్గంలా ఉండాలి.
సత్యం
సూర్య బింబంలా అనుక్షణం వెలుగుతూ ఉండాలి.
నీతి
కడిగిన ముత్యంలా తళతళ ప్రకాశిస్తూ ఉండాలి.
న్యాయం
కటిక చీకటిలో సహితం దివ్యంగా మెరిసే వజ్రంలా ఉండాలి.
మనస్సు
పెరుగు గిలకొట్టి ఇప్పుడే తీసిన వెన్నముద్దలా ఉండాలి.
కోరిక
అమరత్వాన్ని సిద్ధింపజేసే అమృతంలా ఉండాలి.
విద్య
విజయలక్ష్మి నందించే మహాశక్తిలా ఉండాలి.

# వైరుధ్యాలు

అందమైన నీ సృష్టిలో
వికారాలు ఏల పుట్టె ? ॥
రమ్యమైన పూలచెట్లు
రుచ్యమైన పండ్లచెట్లు
నర నాగరికత పెంపుకు
మూలమైన వృక్షతతులు
నిండియున్న నీ సృష్టిలో
ముండ్ల కంప లేలపుట్టె ॥
పాలనిచ్చు గోసంతతి
ఊలనిచ్చు గొర్లమంద
నవ నాగరికత పెంపుకు
ఉపకరించు జంతుతతులు
కల్పించిన నీ సృష్టిలో
క్రూర మృగము లేలపుట్టె ॥
పాలు నీరు వేరుచేయు
అందమైన హంసలేమ
పాడి మనసు చూరగొనెడు
పిక సమూహ మిలనుండగ
పొడిచి చీల్చి మెక్కుచుండు
రాబందులు ఏలపుట్టె ॥
పూలచెంత చేరితేనె
సేకరించు జుంటీగలు
భూసారము పెంచుచుండు
వానపాములిచటనుండ
కాటువేసి చంపజూచు
కాలనాగు లేలపుట్టె ॥

సత్యధర్మ మార్గములను
ఆచరించు జనులుండగ
నీతినియతి పాటించుచు
బ్రతుకు జనులు ఇటనుండగ
పరులను పీడించునట్టి
దుష్టజనులు పుట్టిరేల ॥

## ప్రగతి పెంచుకో ప్రగతి సాధించుకో

ప్రగతి సాధనకు పూనుకో
ప్రతిభ పెంచుకొని సాగిపో ॥
నిలబడిపోతే నడిపే వారెవరు?
దూసుకపోతే ఆపేవారెవరు?
నీ చైతన్యమె నినునడిపించును
నీ స్వశక్తియే నిను గెలిపించును
ప్రగతి సాధనకు పూనుకో
ప్రతిభ పెంచుకొని సాగిపో ॥
లక్షణమైన లక్ష్యసాధనకు
ధర్మమార్గమున సాగిపో
అభిమానమ్మును వదలకు వదలకు
అహంకారమే పతనం మరువకు
పలుకు పలుకులో సత్యము పంచుము
సమతా మమతలు సతతము పెంచుము
ప్రగతి సాధనకు పూనుకో
ప్రతిభ పెంచుకొని సాగిపో ॥

# రాలేదు-రావాలి

రాలేదు రాలేదు రాలేదులే
మనిషి మనసునందు మార్పు రాలేదులే
ఎన్ని నాళ్లు చదివినా ఎంత చదువు చదివినా
ఆశించిన మంచి మార్పు రాలేదులే

కాలమెంత గడచినా అనుభవాలు పొందినా
కరుణ ఎదలో సుంత కూడ పెరుగలేదులే
తపము జపము చేసినా పరిశోధన జరిపినా
మనిషి స్వార్ధమిసుమంతయు తరుగలేదులే

వనితనమే పెరిగినా ప్రగతి ఎంత జరిగినా
పాపబుద్ధి మనిషిలోన చావలేదులే
బలహీనుల కష్టాలను రూపుమాపజేయుకై
బలవంతులు త్యాగబుద్ధి చూపలేదులే

శాస్త్రిలూ పెరిగినా చర్చలెన్ని జరిగినా
మాయచేయు మనిషిబుద్ధి మారలేదులే
నీతులెన్ని రాసినా నియమాలను పెంచినా
న్యాయం పాటించువారు పెరుగలేదులే

రావాలి రావాలి రావాలిలే
మనిషి మనసునందు మార్పు రావాలిలే
సమత సుమత భావమ్ములు మనషి మనసునందు పెరిగి
మంచి పెంచు మంచి మార్పు రావాలిలే

# మనోమార్గం

ఎవరు మెచ్చిన నేమి
మెచ్చుకున్నను ఏమి
నా ఎడద చూపించు
బాటలో పయనింతు

నీతి ఘనతను నమ్మి
నియతిలో జీవింతు
న్యాయ దేవతనెపుడు
కీర్తించి జీవింతు

సత్యవాదముచేసి
సత్య శోధన చేసి
సత్యమును సతతమ్ము
సత్యముగ పాటింతు

స్నేహితుల హితముకై
నా శక్తినర్పింతు
స్నేహార్థినై నేను
సర్వదా జీవింతు

భాషించు భాషలో
ప్రతిభనే చూపింతు
ఎల్లవారలు మెచ్చు
నటులనే భాషింతు.

చట్టాలనన్నిటిని
చకచకా పాటింతు
శాస్త్ర విద్యలు నేర్చి
కీర్తి నే ఘడియింతు.

ధర్మ దేవతనెపుడు
తలదాల్చి పూజింతు
సర్వదా ధర్మమ్ము
పాటించి జీవింతు.

వృత్తి విద్యలయందు
ఆసక్తి చూపింతు
పాటించు వృత్తిలో
ప్రతిభనే సాధింతు.

నా నడకలో నేను
నవ్యతను చూపింతు
సంప్రదాయాలనూ
సృష్టించి పాటింతు.

# ఎవ్వరో ?

ఎవ్వరో వారెవ్వరో
ఎవ్వరో మరిఎవ్వరో

నింగినిండుగ మెరయుచుక్కలు
విసిరి వేసిన శక్తివంతులు
సూర్యచంద్రులు సకల గ్రహములు
తిరుగునట్లుగ నడుపువారలు

ఎవ్వరో వారెవ్వరో
ఎవ్వరో మరి ఎవ్వరో

సకలజీవులు మనుటకొరకై
సమీరమ్మును పంపువారలు
వర్షరుతువులో అంబరమ్మున
మేఘమాలను దింపువారలు

ఎవ్వరో వారెవ్వరో
ఎవ్వరో మరి ఎవ్వరో

చెట్టుచెట్టుకు రంగురంగుల
పూలదండును నిలుపువారలు
గగనవీధిలో ఎగిరిపోయే
పక్షిజాతికి ఎగురనేర్పినదెవ్వరో

ఎవ్వరో వారెవ్వరో
ఎవ్వరో మరిఎవ్వరో

# నువ్వే ఉంటే....

ఉంటే నువ్వు ఉంటే
అందు ఇందు ఎందైనా
నువ్వే నిలిచి ఉంటే
సృష్టి స్థితిలయములకు
కారకుడవు కలకాలం
నువ్వే అయి ఉంటే—

బలహీనులు బలవంతుల
చేతులలో నలిగి నలిగి పోతూఉంటే
పతనం అవుతూ ఉంటే
చూస్తూ ఊరుకుంటావా
ఉంటే నువ్వు ఉంటే—

అమాయకుల గుండెలలో
ఆరని జ్వాలలు రేపే
దుర్మార్గుల దుసుమకుండ ఉంటావా
ఉంటే నువ్వు ఉంటే—

నీతిని పాటించువారు
నిత్యము అవినీతిపరుల
చేతులలో నాశనమై పోతూ ఉంటే
చూస్తూ ఊరుకుంటావా
ఉంటే నువ్వు ఉంటే—

# ఎప్పటికో

ఎప్పటికో ఎప్పటికో ఎప్పటికో
ఈలోకం నాకంలా
మారిపోవునన్నమాట
నిజమయ్యే ఆకాలం
వచ్చేనా? ఎప్పటికో

ఎప్పటికో ఎప్పటికో ఎప్పటికో
సత్యం ప్రతి పలుకు ద్వార
ప్రకటితమవుననే మాట
నిజమయ్యే ఆకాలం
వచ్చేనా? ఎప్పటికో

ఎప్పటికో ఎప్పటికో ఎప్పటికో
చీమకైన హానిచేయ
తలపెట్టని మనసు కలిగి
ఉండున్నరులు ఉండురోజు
వచ్చేనా? ఎప్పటికో

ఎప్పటికో ఎప్పటికో ఎప్పటికో
నాలుగు పాదాల మీద
న్యాయం నడయాడురోజు
వచ్చునన్న ఆకాలం
వచ్చేనా? ఎప్పటికో

# మార్పు

మార్పు తరలి వస్తున్నది
నేర్పు ఎదిగి వస్తున్నది
గుడిసె ఉన్నచోట పసిడి
మేడ ఎదిగి వస్తున్నది.

విజ్ఞానం దీప్తి లాగ
ఎదిగి ఎదిగి వస్తున్నది
అజ్ఞానం అంతలోనె
కరిగి కరిగి పోతున్నది.

పాడుబడ్డ భూమినేడు
పంటలక్ష్మియగుచున్నది
సిరులు పండినట్టినేల
గడ్డి భూమియగుచున్నది.

భయపెట్టిన భూస్వాములు
భయకంపితులగు చుండిరి
ధనస్వాముల గుండెలలో
గుబులు గుబులు మొదలయ్యెను.

బలవంతుల పన్నాగం
బట్ట బయలు అవుతున్నది
చీకటి తప్పులు చేసిన
శిక్షకు గురియగుచుండిరి.

అందలాలు మోయువారు
అసలు నేడు కనిపించరు
వందనమ్ము చేయుచేతు
అందు మార్పు కనిపించును.

వారసత్వ అధికారం
అసలు నేడు చెల్లకుండె
సేవ ఉన్నవాడు నేడు
అధికారం చేయుచుండె.

అంతరాలు తొలగించేడు
శాసనాలు వస్తున్నవి
అందరి క్షేమము కోసం
సమత మమత వస్తున్నవి.

అంతరాలు తొలగిపోవు
మార్పు దీప్తి వస్తున్నది
అంతరి క్షేమం కోరుచు
సమత మమత వస్తున్నవి.

అంతరాలు తొలగించేడు
విద్య వెలుగు వస్తున్నది.

# అనురాగం

అనురాగం ఆప్యాయత
పంచుతాను రారా!
ఆంధ్రభాష మొదటి
రెండు అక్షరాల లాగ ॥అనురాగం॥

తెగకూడని బంధమ్మును
తెంచివేసి పోకురా
ఎదకోతకు గురిచేసి
దూరము కాబోకురా ॥అనురాగం॥

ఎదలోపల దాగియున్న
అనురాగపు నిధినీ
పంచుతాను రారా!
ఎద పెంచుకొనుచు రారా ॥అనురాగం॥

నీకు నేను సదాహితము
కూర్చుతానులేరా
మనసునందు మమత తేనె
నింపుతాను రారా! ॥అనురాగం॥

ప్రేమసుధలు మన ఎదలను
కలిపి ఉంచవలెనురా
అనురాగం ఆప్యాయత
పంచుతాను రారా! ॥అనురాగం॥

# హద్దు మీరితే

ప్రమిద అంచున
వత్తికి కట్టుబడియుండి
వెలుగుతున్నానని
చీకటిని పారద్రోలుతూ
నీకు సేవలు చేస్తున్నానని
ఊదేస్తే ఆరిపోతానని
నన్ను నిర్లక్ష్యంగా చూడకు.
నా ఒళ్లు మండితే
నిన్ను నీ సర్వస్వాన్ని
క్షణాలలో బూడిద చేసేస్తాను.
చుట్టూ ఆవరించి
గాలిలా నీ చుట్టే తిరుగుతున్నానని
అప్రయత్నంగానే
అవసరమున్నంతగా
నీకు దొరుకుతున్నానని
నన్ను ఉపేక్ష చేయకు కల్మషంచేయకు
నా మనసు మండితే
తుఫాన్ సృష్టిస్తాను
వర్షాలను కురిపిస్తాను
మన్నుమిన్నూ ఏకం చేసేస్తాను.
మట్టిలాగ పడిఉన్నానని
సేద్యం పేరిట
ఒళ్లు చీరినా ఓర్చు కొంటున్నానని
గనుల పేరిట

రంధ్రాలు చేసినా నిశ్చలంగా ఉంటున్నానని
అవధులు మించి బాధించకు.
నా కడుపు మండితే
ప్రకంపిస్తాను
అప్పుడు మీరూ మీ ఇళ్లూ
మీ సర్వస్వం ధ్వంసం అవుతాయి.
వివేకమ్ము గలవారలు
హద్దుమీర లేరెప్పుడు.
తగువిధముగ ప్రయత్నించి
ప్రగతివారు సాధింతురు.
అవివేకుల ఆలోచన
హద్దుమీరి సాగుచుండు.
అవివేకుల చర్యలతో
వినాశనము కలుగుచుండు.

# నిర్వచనాలు

పుస్తకం—
జ్ఞాన దీప్తిని పంచే దివ్యజ్యోతి.
చెట్టు—
స్వార్థం ప్రకటించకుండా ఫలితమందించేత్యాగశీలి.
యంత్రం—
మనిషి ఆలోచనతో తయారైన బానిస.
దీపం—
బ్రతికినంతకాలం చీకటిని వేటాడేవేటకత్తె.

గాలి—
అదృశ్యంగా కదులుతూ కదిలించే దివ్యశక్తి.
నిప్పు—
ఉన్నచోట తన ఉనికిని ఉచితంగా తెలిపే ఉగ్రశక్తి.
నీరు—
నడుస్తూ ప్రాణులను నడిపించే అమరశక్తి.
మట్టి—
సకల ప్రాణుల ఆవిర్భావానికి కారణమైన ఆదిశక్తి.
ఆకాశం—
ఆదినుండి ఆలోచనాపరులను అంతుచిక్కని అనంతశక్తి.
నిద్ర—
భౌతిక శరీరానికి అర్ధమృత్యువు.
పురుగు—
మురుగు ఉన్నచోట ఉద్భవించే వ్యర్థజీవి.
చీమలు—
అలసట ఆలసత్వం లేకుండా శ్రమించే శ్రమైక జీవులు.
పలుకులు—
నెయ్యమును కయ్యమును వియ్యమును కల్పించేకల్పనాశక్తి
విద్య—
మనిషిని మనిషిగా తీర్చిదిద్దే మహత్తరశక్తి
విద్యుత్తు—
ఆలోచనారూపని విద్యుత్తుతో అవిర్భవించిన అభౌతికశక్తి
నేర్పు—
నరజాతినీ తీర్చి దిద్దిన ఉచిత శక్తి.
ఓర్పు—
ఔచిత్యం పాటిస్తూ తీసుకోవలసిన నిర్ణాయక శక్తి.
తీర్పు—
న్యాయాధిపతి అంతరంగం వివేకంతో వినిపించేతుదిపలుకు.

# పరమాత్మ పలుకులు

అజ్ఞానముతో చిక్కుల
పాలయ్యేడి అమాయకుల
అజ్ఞానము తొలగించెద
విజ్ఞానము నందించెద.

అతివృష్టి అనావృష్టి
ఆకలి రోగాలులేని
నవలోకం సృష్టించెద
నవ్యతనే సాధించెద.

అవనిపైన అసమానత
భావాలను రూపుమాపి
సమత మమత భావాలను
మనిషి మనిషిలో నింపెద.

ఈలోకం జనులందరు
మెచ్చునట్లు భాషించెద
కఠినోక్తులు పలుకు జనుల
కఠినముగా శిక్షించెద.

ఈ లోకములో శోకము
లేకుండగ చేసివేసి
భూలోకం నాకంలా
మార్చివేసి చూపించెద.

ఊరుచెంత ఏరులేక
ఊరువారు బాధపడిన
మంచినీరు ఊరించెద
ఏరులాగ పారించెద.

ఎడారులుగ మారినట్టి
నేలలన్ని పండునటుల
మేఘాలను సృష్టించెద
వర్షాలను కురిపించెద.

కలిమితప్ప లేమిలేని
కోరదగిన లోకమ్మును
అందముగా సృష్టించెద
అవనికి నేనందించెద.

కౄరబుద్ధి కలవారిని
గర్హించెద ఓడించెద
సుగుణమ్ములు గలవారిని
కల్పించెద గెలిపించెద.

గుణహీనులు బలహీనులు
ధనహీనులు లేనికొత్త
విశ్వమునే సృష్టిచేసి
సృష్టిలోకి పంపించెద.

చీకాకును కలిగించే
చీకటి ఏనాడులేని
లోకమునే సృష్టించెద
మీకు నేను అందించెద.

దుర్మార్గమె మార్గమనుచు
సన్మార్గుల బాధించెడు
దుర్మార్గుల దునిమినేను
సన్మార్గుల రక్షించెద.

ద్వేషించే గుణములేని
నరజాతిని సృష్టించెద
ప్రేమసుధను మనిషెదలో
నింపినేను పంపించెద.

పచ్చదనముతో పాటుగ
పసిడి ఫలములందించే
చెట్లులన్ని ఎదుగుటకై
చేవనేను అందించెద.

పరులకెపుడు మేలుచేయు
మంచిమనసు గలవారికి
శక్తి యుక్తులందించెద
వారి ఘనతనే పెంచెద.

పుట్టినట్టి ప్రాణులన్ని
గిట్టకుండ ఉండునటుల
అమృతమును సృష్టించెద
ప్రాణికోటి కందించెద.

పేదరికముతో బాధలు
పడుచుండిన పేదవారి
బాధలన్ని తొలగించెద
భాగ్యమునే నందించెద.

మంచిమాట మంచినడక
ధర్మబుద్ధి కలిగియున్న
నరజాతిని ఈధరణికి
కానుకగా అందించెద.

మనుజజాతి చరిత్రకే
మచ్చతెచ్చు నరాధములఁ
పట్టుబట్టి పట్టిపట్టి
మట్టుపెట్టి తలపెట్టెద.

యుద్ధములే చేసిచేసి
మానవులే మరణించిన
రణపిపాస లేనినరుల
సృష్టించెద పంపించెద.

రోగాలతొ నొప్పులతో
బాధపడెడు దీనజనుల
చేరదీసి వారిబాధ
తొలగించెద రక్షించెద.

సజ్జనులకు రక్షణనే
కల్పించెద కాపాడెద
దుష్టాత్ముల నెల్లప్పుడు
బెదిరించెద బాధించెద.

# రాధాకృష్ణా!

భరతమాత ధన్యురాలు
నిన్ను ఆమె కన్నందుకు
వాగ్దేవత మాన్యురాలు
నీ వాక్కులు విన్నందుకు
అందును రాధాకృష్ణా!
అందుకొనుము వందనాలు.

విద్యలలో అత్యున్నత
విలువలెన్నొ సాధించిన
దీక్షనీది ఘనతనీది
సహజశక్తి నీదినీది
అందును రాధాకృష్ణా!
అందుకొనుము హృదయాంజలి.

వేదాంతము చదివిచదివి
వేదాంతివి అయితివీవు
వేదాంతము పలికిపలికి
వేదనిధివి అయితివీవు
అందును రాధాకృష్ణా!
అంజలులివి అందుకొనుము.

అధ్యాపక మహాచార్య
పదవులు చేపట్టినావు
విద్యారంగము నందున
ప్రగతిమెట్లు కట్టినావు
పండిత రాధాకృష్ణా!
ప్రణామాలు ప్రణామాలు.

దేశ దేశ పండితులను
అబ్బుర పరచినవాడా
స్టాలిన్ చర్చిల్ మెప్పును
పొందిన ఘన పండితుడా,
అందుకొనుము వందనాలు
వందనాలు వందనాలు

అందిన పదవులు పొందుచు
అభ్యుదయం పెంచినావు
చేపట్టిన ప్రతి పదవికి
సేవ నీవు పంచినావు
అందును రాధాకృష్ణా।
వందనాలు వందనాలు

గ్రంథ రచన చేసి చేసి
రాణించిన ప్రతిభనీది
విశ్వశాంతి కోరినట్టి
విమలమైన చరితనీది
రచయిత రాధాకృష్ణా।
అందుకొనుము వందనాలు

భారత అధ్యక్ష పదవి
దక్షతతో నిర్వహించి
దేశానికి విశ్వఖ్యాతి
తెచ్చినట్టి ఘనుడవీవు
అందును రాధాకృష్ణా।
అందుకొనుము మాజోతలు

భరతరత్న బిరుదమ్మును
ఉచితముగా పొందినావు
ఔచిత్యము తెలిసినట్టి
డాక్టర్ రాధాకృష్ణా।
అందుకొనుము వందనాలు
వంద వంద వందనాలు.

## మనసు వేసిన ప్రశ్నలు

రాసి రాసి రమ్యముగా
ఏమి రాయ నేర్చినావు?
ఏ మనసున నీభావం
నింపగలుగ నేర్చినావు?

పాడి పాడి మధురముగా
ఏమిపాడ నేర్చినావు?
ఏ శ్రోతను మెప్పించీ
మెప్పుపొంద గలిగినావు?

గీసి గీసి ఏ గీతను
బొమ్మలాగ మలచినావు?
ఏ బొమ్మను గీసి నీవు
ఎవరి మెప్పు పొందినావు?

ఏ వేషము వేసి నీవు
ఎంతనటన నేర్చినావు?
అభినయించి ఎందరికి
ఆనందం పంచినావు?

అంగాలను త్రిప్పి త్రిప్పి
ఏ నాట్యము నెర్చినావు?
నాట్యకళను ప్రదర్శించి
ఎవరిమెప్పు పొందినావు?

ఆడి ఆడి ఏ ఆటలో
నైపుణ్యం పొందినావు?
ఏ ఆటను ఎచట ఆడి
గెలుపు నీవు పొందినావు?

పలికి పలికి ధారలాగ
ఏమి పలుక నేర్చినావు?
ఏ పలుకులు పలికినీవు
జనులమెప్పు పొందినావు?

నామనసే నన్నిప్పుడు
ప్రశ్నించగ జూస్తున్నది
ఘనకార్యము సాధించని
బ్రతుకు వ్యర్థమంటున్నది.